

JBM 01
Jul-Aug 2021

be the epistle of CHRIST

# క్రీస్తు పత్రిక

"రాతిపలక మీద గాని సిరాతో గాని వ్రాయబడక, మెత్తని హృదయములు అను పలకల మీద జీవము గల దేవుని ఆత్మతో మా పరిచర్య మూలముగా వ్రాయబడిన **క్రీస్తు పత్రిక** యైయున్నారని మీరు తేటపరచబడుచున్నారు" (2కొరింథి 3:3)

## Qumran Caves in Israel
## Bible Scrolls found in Clay Jars



Jeria Bible Mission

# లోపలి పేజీల్లో...




**Published by :**
Jeriah Bible Mission
Peddapalli, Telangana-505172

**Blog :**
jeriahbiblemission.blogspot.com

**email :**
jeriahbiblemission@gmail.com

**Contact No :**
7013 63 9470
(Plz Whatsapp only)



**D.T.P. & Designing :**
adept Digitals, Peddapalli. 9395 11 3648




ప్రతిరోజు మనం బైబిలును చదవడం, అర్థంచేసుకోవడం, ఆ ప్రకారంగా జీవించడం ఇది ఒక నిత్య కృత్యము. ఏ మాత్రం ఏమరుపాటుగా ఉన్నా, వాక్యాన్ని సందర్భోచితంగా చదవకపోయినా విపరీతార్థాలు వచ్చే అవకాశం ఉన్నది. పూర్తిగా బైబిలు చదివితే తప్ప మనం బైబిల్‌ను, దేవుని ఉద్దేశ్యాలను సరిగా అర్థం చేసుకోలేము. దీని కోసం ఎంతో శ్రద్ధ, ఓపికతో పాటు సమయం కూడా చాలా వెచ్చించాల్సి వస్తుంది. పాత నిబంధనా గ్రంథములోని 39 పుస్తకాలు (929 అధ్యాయాలు), కొత్త నిబంధనా గ్రంథములోని 27 పుస్తకాలు (260 అధ్యాయాలు) చదవాలంటే, రోజుకు 2-3 అధ్యాయాలు చొప్పున చదివినా, కనీసం 14 నెలల నుండి 20 నెలల కాలం పడుతుంది. ఇది కూడా మామూలుగా చదువుకుంటూ పోతేనే అంత సమయం పడుతుంది. మరి అధ్యయనము చేయాలంటే? ఎవరైనా చెప్పిన సిద్ధాంతాలు సరియైనవా, కావా అని పరిశోధించాలంటే? అబ్బో, మన జీవిత కాలమంతా పరిశోధన చేస్తూనే ఉండాలి.

ఇలా కాకుండా మనం బైబిల్ థీమ్ అంటే బైబిల్ వ్రాయించడంలో దేవుని ప్రాథమిక ఉద్దేశ్యాన్ని గ్రహించగలిగితే మనకు చాలా మేలుకరంగా ఉంటుంది కదా! అలాంటి సందేశమే ఇప్పుడు మనం చదవబోయేది. ఈ సందేశాన్ని సరియైన రీతిలో అర్థం చేసుకోవడానికి పరిశుద్ధాత్మ దేవుడు మనకు సహాయం చేయునుగాక! ఆమెన్.

**ముందుగా ఈ క్రింది వచనాలు శ్రద్ధగా చదువుదాం!**

మత్తయి 22:34-40

"ఆయన సద్దూకయ్యుల నోరు మూయించెనని పరిసయ్యులు విని కూడివచ్చిరి. వారిలో ఒక ధర్మశాస్త్రోపదేశకుడు ఆయనను **శోధించుచు,** బోధకుడా, **ధర్మశాస్త్రములో ముఖ్యమైన ఆజ్ఞ** ఏదని అడిగెను. అందుకాయన నీ పూర్ణహృదయముతోను నీ పూర్ణాత్మతోను నీ పూర్ణమనస్సుతోను నీ దేవుడైన ప్రభువును ప్రేమింపవలెననునదియే. ఇది ముఖ్యమైనదియు మొదటిదియునైన ఆజ్ఞ. నిన్నువలె నీ పొరుగువాని ప్రేమింపవలెనను రెండవ ఆజ్ఞయు దానివంటిదే. ఈ రెండు ఆజ్ఞలు ధర్మశాస్త్రమంతటికిని ప్రవక్తలకును ఆధారమైయున్నవని అతనితో చెప్పెను."

పై వచనాలను గమనించినట్లయితే, ధర్మశాస్త్రోపదేశకుడు యేసుక్రీస్తు ప్రభువులవారిని **'శోధించుచు'** ఈ ప్రశ్న అడిగాడు అని చెప్పబడింది. ఈ మాటకు గ్రీకులో 'పిరాడ్జో' అనే పదం ఉపయోగించబడింది. దీనికి 'పరీక్షించడం', 'ప్రలోభపెట్టడం', 'పరిశీలించడం' అనే అర్థాలున్నాయి.

**(G3985)** πειράζω, — *pi-rad'-zo*; from **(G3984)** (πεῖρα); to *test* (object), i.e. *endeavor, scrutinize, entice, discipline*: — assay, examine, go about, prove, tempt (-er), try.

అంటే ధర్మశాస్త్రోపదేశకుడు యేసుక్రీస్తు ప్రభువుకు ధర్మశాస్త్రం మీద ఎంత వరకు అవగాహన ఉందో తెలుసుకుందామని పరీక్షించడానికి ఈ ప్రశ్న వేశాడని అర్థమౌతోంది. అంటే అతను వేసిన ప్రశ్న చాలా కఠినమైన ప్రశ్న అన్నమాట! ఇంతకీ అతను వేసిన ప్రశ్న ఏంటి?

ధర్మశాస్త్రములో ముఖ్యమైన ఆజ్ఞ ఏమిటి? ఈ ప్రశ్న ఎలాంటిదంటే ఒక ఇంటికి నాలుగు పిల్లర్లు ఉన్నాయనుకోండి, అందులో ఏ పిల్లర్ ముఖ్యమైనది అని అడిగినట్లుంది. అంటే మిగతా మూడు పిల్లర్లు లేకున్నా ఆ ఇల్లు నిలబడాలన్న మాట! అంటే ధర్మశాస్త్రములో ఏ ఒక్క ఆజ్ఞను పాటిస్తే సరిపోతుంది, ఏ ఒక్క ఆజ్ఞ పాటిస్తే ధర్మశాస్త్రం విషయంలో అపరాధులం కాకుండా ఉండవచ్చును అని అడుగుతున్నాడు.

ఒకసారి యాకోబు పత్రిక 2వ అధ్యాయంలో ఈ క్రింది వచనాలు చదువుదాం;

యాకోబు 2:10-11- **"ఎవడైనను ధర్మశాస్త్ర మంతయు గైకొనియు, ఒక ఆజ్ఞవిషయములో తప్పిపోయినయెడల, ఆజ్ఞలన్నిటి విషయములో అపరాధి యగును; వ్యభిచరింపవద్దని చెప్పినవాడు నరహత్యచేయ వద్దనియు చెప్పెను గనుక నీవు వ్యభిచరింపకపోయినను నరహత్య చేసినయెడల ధర్మశాస్త్రవిషయములో నపరాధి వైతివి."**

పై వచనాన్ని బట్టి, ఏ ఒక్క ఆజ్ఞ విషయంలో తప్పిపోయినా మనం మొత్తం ధర్మశాస్త్ర విషయంలో అపరాధులమే. కాబట్టి ధర్మశాస్త్రములో ముఖ్యమైన ఆజ్ఞ ఏమిటి అని చెప్పడం సాధ్యం కాదు. అందుకే ఆ ధర్మశాస్త్రోపదేశకుడు యేసుక్రీస్తు ప్రభువును పరీక్షించడానికే ఈ ప్రశ్నను వేశాడు.

కాని యేసు ప్రభువు ఎలాంటి తడబాటు లేకుండా **"నీ పూర్ణహృదయముతోను నీ పూర్ణాత్మతోను నీ పూర్ణమనస్సుతోను నీ దేవుడైన ప్రభువును ప్రేమింపవలెననునదియే. ఇది ముఖ్యమైనదియు మొదటిదియునైన ఆజ్ఞ. నిన్నువలె నీ పొరుగువాని ప్రేమింపవలెనను రెండవ ఆజ్ఞయు దానివంటిదే"** అని అడిగిన వెంటనే బదులిచ్చాడు.

మరి ప్రభువు చెప్పిన విధంగా **"...నీ దేవుడైన ప్రభువును ప్రేమింపవలెను, నిన్నువలె నీ పొరుగువాని ప్రేమింపవలెను"** అను వాటిని పాటిస్తే ఏవిధంగా ధర్మశాస్త్రమంతయు పాటించినట్లు అవుతుంది? అసలు దేవున్ని ప్రేమించడం అంటే ఏమిటి?

ఒకసారి అపోస్తలుడైన యోహాను వ్రాసిన ఈ క్రింది వచనాలు చదువుదాం;

యోహాను 14:15- **"మీరు నన్ను ప్రేమించినయెడల నా ఆజ్ఞలను గైకొందురు."**

యోహాను 14:21- **"నా ఆజ్ఞలను అంగీకరించి వాటిని గైకొనువాడే నన్ను ప్రేమించువాడు; ...."**

1యోహాను 5:3- **"మనమాయన ఆజ్ఞలను గైకొనుటయే దేవుని ప్రేమించుట....."**

పై వచనాలను బట్టి చూస్తే దేవుని ప్రేమించడం అంటే ఆయన ఆజ్ఞలు గైకొనడమే. అంటే **"నీ పూర్ణహృదయముతోను నీ పూర్ణాత్మతోను నీ పూర్ణమనస్సుతోను నీ దేవుడైన ప్రభువు ఆజ్ఞలను గైకొనుటయే"** ధర్మశాస్త్రమంతటిలో ముఖ్యమైనదియు మొదటిదియునైన ఆజ్ఞ.

ధర్మశాస్త్రమంటేనే ఆయన ఆజ్ఞల సమాహారం కదా! ఇక ఇందులో చెప్పడానికేముంది, ఆజ్ఞలన్నిటినీ పూర్ణహృదయముతోను, పూర్ణాత్మతోను, పూర్ణ మనస్సుతోను గైకొనుమని చెప్పినట్టే కదా!

మరి **"నిన్నువలె నీ పొరుగువాని ప్రేమింపవలెనను రెండవ ఆజ్ఞయు దానివంటిదే"** అని చెప్పాడు గదా! దాని విషయం ఆలోచిద్దాం!

ఒకసారి అపోస్తలుడైన పౌలు రోమీయులకు వ్రాసిన పత్రికలో చెప్పిన ఈ క్రింది వచనాలను చదువుదాం;

రోమా 13:8-10- **"ఒకని నొకడు ప్రేమించుట విషయములో తప్ప మరేమియు ఎవనికిని అచ్చియుండవద్దు. పొరుగువానిని ప్రేమించువాడే ధర్మశాస్త్రము నెరవేర్చినవాడు. ఏలాగనగా వ్యభిచరింపవద్దు, నరహత్య చేయవద్దు, దొంగిల వద్దు,**

**ఆశింపవద్దు అనునవియు, మరి ఏ ఆజ్ఞయైన ఉన్నయెడల అదియు నిన్నువలె నీ పొరుగువాని ప్రేమింపవలెనను వాక్యములో సంక్షేపముగా ఇమిడియున్నవి. ప్రేమ పొరుగువానికి కీడుచేయదు గనుక ప్రేమకలిగి యుండుట ధర్మశాస్త్రమును నెరవేర్చుటయే."**

పై వచనాలను గమనించినట్లయితే, "... వ్యభిచరింపవద్దు, నరహత్య చేయవద్దు, దొంగిలవద్దు, ఆశింపవద్దు అనునవియు **మరి ఏ ఆజ్ఞయైన ఉన్నయెడల**...." అంటే ఎన్ని ఆజ్ఞలు వున్నా సరే, ఆ మొత్తం ఆజ్ఞలన్నియు నిన్నువలె నీ పొరుగువాని ప్రేమింపవలెనను వాక్యములో **సంక్షేపముగా** ఇమిడియున్నవని, ఎందుకంటే, ప్రేమ పొరుగువానికి కీడుచేయదు గనుక ప్రేమకలిగియుండుట ధర్మశాస్త్రమును నేరవేర్చుటయే అని చెప్పబడింది.

పౌలు ఇదే విషయాన్ని గలతీయులకు వ్రాసిన పత్రికలో మరోసారి చెప్పాడు;

గలతీ 5:14- **"ధర్మశాస్త్ర మంతయు నిన్నువలె నీ పొరుగువానిని ప్రేమించుము అను ఒక్క మాటలో సంపూర్ణమైయున్నది"**

అంటే మనం మన పొరుగువారిని ప్రేమించడం వలన వారికి ఎలాంటి కీడు చేయాలన్న తలంపు రాదు కాబట్టి, వ్యభిచరించడం, నరహత్యచేయడం, దొంగిలించడం.... లాంటి పనులు చేయలేము. అందువలన మనం ధర్మశాస్త్రంలో చెప్పబడిన ఆజ్ఞలన్నీ గైకొన్నవారమవుతాము. ఆవిధంగా, నిన్నువలె నీ పొరుగువాని ప్రేమిస్తే ధర్మశాస్త్రమును నెరవేర్చినట్టే.

ఈ రెండవ ఆజ్ఞ కూడా మొదటి దానివంటిదే అని ప్రభువు సెలవిచ్చారు. దేవున్ని ప్రేమించడమంటే ఆయన ఆజ్ఞలు గైకొనడమే గదా! మరి ఆయన ఆజ్ఞలన్నీ నిన్నువలె నీ పొరుగువాని ప్రేమించడంలో ఇమిడి ఉన్నాయి గదా! అంటే నిన్నువలె నీ పొరుగువాని ప్రేమిస్తే మనం దేవున్ని ప్రేమించినట్టే అన్నమాట!

అంటే మరోవిధంగా చెప్పాలంటే **'మనవలె మన పొరుగువాని ప్రేమించడం ద్వారానే.... దేవున్ని ప్రేమించగలం'.** అంటే ఒకడు తన పొరుగువాని **ద్వేషిస్తూ, దేవున్ని ప్రేమించడం అసాధ్యం, అబద్ధం.**

1యోహాను 4:20-21 -"ఎవడైనను-నేను **దేవుని ప్రేమించుచున్నానని** చెప్పి, తన **సహోదరుని ద్వేషించినయెడల** అతడు **అబద్ధికుడగును;** తాను చూచిన తన సహోదరుని ప్రేమింపని వాడు తాను చూడని దేవుని ప్రేమింపలేడు. **దేవుని ప్రేమించువాడు తన సహోదరుని కూడ ప్రేమింపవలెనను** ఆజ్ఞను మనమాయనవలన పొందియున్నాము."

1యోహాను 3:23 -"ఆయన ఆజ్ఞ యేదనగా -ఆయన కుమారుడైన **యేసుక్రీస్తు నామమును నమ్మికొని,** ఆయన మనకు ఆజ్ఞనిచ్చిన ప్రకారముగా **ఒకనినొకడు ప్రేమింపవలెననునదియే."**

యాకోబు 2:8 -"మెట్టుకు **నీవలె నీ పొరుగువాని ప్రేమించుమను** లేఖనములో ఉన్నట్టి ప్రాముఖ్యమైన యీ ఆజ్ఞను మీరు **నెరవేర్చినయెడల బాగుగనే ప్రవర్తించువారగుదురు."**

1యోహాను 3:8-11 -"అపవాది మొదటనుండి పాపము చేయుచున్నాడు గనుక **పాపముచేయు వాడు అపవాది సంబంధి;** అపవాది యొక్క క్రియలను లయపరచుటకే దేవుని కుమారుడు ప్రత్యక్షమాయెను. **దేవుని మూలముగా** పుట్టిన ప్రతివానిలో **ఆయన బీజము** నిలుచును గనుక వాడు **పాపముచేయడు;** వాడు **దేవుని మూలముగా పుట్టినవాడు గనుక పాపము చేయజాలడు.** దీనినిబట్టి దేవుని పిల్లలెవరో అపవాది పిల్లలెవరో తేట పడును. **నీతిని జరిగించని ప్రతివాడును, తన సహోదరుని ప్రేమింపని ప్రతివాడును దేవుని సంబంధులు కారు.** మనమొకని నొకడు ప్రేమింపవలెననునది మొదటనుండి మీరు వినిన వర్తమానమేగదా."

## మనం మన పొరుగువారిని ఎలా ప్రేమించాలి?

ప్రతి రోజు మన పొరుగువారితో నేను **నిన్ను ప్రేమిస్తున్నాను** అని చెబితే సరిపోతుందా? లేక వారికేమైనా సహాయం చేయాలా? ఎలాంటి సహాయం చేయాలి? వాళ్ల అవసరాలన్నీ తీర్చాలా?

1యోహాను 3:18-19 -"చిన్నపిల్లలారా,

**మాటతోను నాలుకతోను కాక క్రియతోను సత్యముతోను ప్రేమింతము.”**

లూకా 6:31: **“మనుష్యులు మీకేలాగు చేయవలెనని మీరు కోరుదురో ఆలాగు మీరును వారికి చేయుడి.”**

మత్తయి 7:12 –**“కావున మనుష్యులు మీకు ఏమి చేయవలెనని మీరు కోరుదురో ఆలాగుననే మీరును వారికి చేయుడి. ఇది ధర్మశాస్త్రమును ప్రవక్తల ఉపదేశమునై యున్నది.”**

రోమా 15:2,3 –**“తన పొరుగువానికి క్షేమాభివృద్ధి కలుగునట్లు మనలో ప్రతివాడును మేలైనదానియందు అతనిని సంతోషపరచవలెను. క్రీస్తు కూడా తన్ను తాను సంతోషపరచుకోలేదు గాని–నిన్ను నిందించువారి నిందలు నా మీద పడెను అని వ్రాయబడినట్లు ఆయనకు సంభవించెను.”**

1యోహాను 3:17 –**“ఈ లోకపు జీవనోపాధిగలవాడైయుండి, తన సహోదరునికి లేమి కలుగుట చూచియు, అతనియెడల ఎంతమాత్రమును కనికరము చూపనివానియందు దేవుని ప్రేమ యేలాగు నిలుచును.”**

యాకోబు 2:15-16 –“సహోదరుడైనను సహోదరియైనను **దిగంబరులై ఆ నాటికి భోజనము లేక యున్నప్పుడు.** మీలో ఎవడైనను శరీరమునకు కావలసినవాటిని ఇయ్యక –**సమాధానముగా వెళ్లుడి, చలి కాచుకొనుడి, తృప్తిపొందుడని చెప్పినయెడల ఏమి ప్రయోజనము.**”

ఇతరులు ఇబ్బందుల్లో ఉండి మన సహాయం కోరితే, మనం తరచుగా –ప్రార్థిస్తాను, దేవుడు సాయం చేస్తాడు; లేదా ఉన్నదాంట్లోనే సర్దుకుపోండి అని సలహాలు ఇస్తూ ఉంటాము. ప్రార్థించడం మంచిదే, దాంతో పాటు మనకు చేతనైన సాయం తప్పకుండా చేయాలి. **అతని స్థానంలో మనం ఉంటే ఇతరుల నుండి ఎలాంటి సాయం ఆశిస్తామో అదే మనం చేయదగినది.**

1యోహాను 3:16 –“ఆయన మన నిమిత్తము తన ప్రాణముపెట్టెను గనుక దీనివలన ప్రేమ యెట్టిదని తెలిసికొనుచున్నాము. మనము కూడ **సహోదరుల నిమిత్తము మన ప్రాణములను** పెట్ట బద్ధులమై యున్నాము.”

మనం మన పొరుగువారిని ఎంతగా ప్రేమించాలి అంటే మనం మన ప్రాణాలు పెట్టడానికి కూడా వెనుతీయవద్దు అని పై వాక్యం చెబుతోంది. మనం మన పొరుగువారికి లేదా మన సహోదరులకు చేసే మాట సాయమో, అన్న వస్త్రాలు ఇవ్వడమో, ఆర్థిక సాయమో, జమానత్ లాంటి మరెలాంటి సాయమైనా చాలా చిన్నవిషయాలే! **అది ఎలాంటి సహాయమైనా చేయకుండా ఉండడానికి ఎలాంటి వాక్యాలను వెతుక్కోవాల్సిన అవసరం లేదు.**

యూదులకు చెప్పబడినవి మనకు ఆపాదించడం, సందర్భానికి భిన్నంగా వాఖ్యానించడం సరికాదు. మొదట మనం **యూదులుగా కన్వర్ట్** అవడంలేదనే విషయాన్ని గ్రహించాలి. యూదులైనా, అన్యులైనా క్రీస్తును అంగీకరిస్తే వారు క్రైస్తవులవుతారు. మనం ఏం చేయాలో? ఎలా నడుచుకోవాలో? నూతన నిబంధనా గ్రంథములో స్పష్టంగా చెప్పబడింది. వాక్యాన్ని సరిగా విభజించడం ద్వారా సరియైన రీతిలో అర్థం చేసుకోగలము.

2తిమోతి 2:15 –**“దేవుని యెదుట యోగ్యునిగాను, సిగ్గుపడనక్కరలేని పనివానిగాను, సత్యవాక్యమును సరిగా ఉపదేశించువానిగాను (సరిగా విభజించువానిగాను) నిన్ను నీవే దేవునికి కనుపరచుకొనుటకు జాగ్రత్తపడుము”**

అయినా ఇతరులకు సహాయం చేయకుండా ఉండడానికి ఎవరైనా కారణాలు వెతుకుతున్నారంటే వారు ఎవరి సంబంధులో అర్థం చేసుకోవచ్చును.

1యోహాను 4:7-8 –“ప్రియులారా, **మనము ఒకనినొకడు ప్రేమింతము;** ఏలయనగా ప్రేమ **దేవునిమూలముగా** కలుగుచున్నది; ప్రేమించు ప్రతివాడును దేవుని మూలముగా పుట్టినవాడై దేవుని ఎరుగును. **దేవుడు ప్రేమాస్వరూపి, ప్రేమలేని వాడు దేవుని ఎరుగడు.**”

1యోహాను 4:6 –“మనము దేవుని సంబంధులము; **దేవుని ఎరిగినవాడు మన మాట**

**వినును, దేవుని సంబంధి కానివాడు మన మాట వినడు.** ఇందువలన మనము **సత్య స్వరూపమైన ఆత్మ యేదో, భ్రమపరచు ఆత్మ** యేదో తెలిసికొనుచున్నాము."

ఇక ఇంతకు మించి చెప్పాల్సిన అవసరం లేదని నేను భావిస్తున్నాను.

**ఏది ఏమైనప్పటికిని ప్రేమ కలిగియుండుటకు ప్రయాసపడుదాం!** (1కొరింథీ 14:1)

## ఇక అసలు విషయానికి వద్దాం!

మరొకసారి మత్తయి సువార్త 22వ అధ్యాయంలో ఈ క్రింది వచనాలు చదువుదాం;

మత్తయి 22:34-40 -"ఆయన సద్దూకయ్యుల నోరు మూయించెనని పరిసయ్యులు విని కూడివచ్చిరి. వారిలో ఒక ధర్మశాస్త్రోపదేశకుడు ఆయనను శోధించుచు, బోధకుడా, ధర్మశాస్త్రములో ముఖ్యమైన ఆజ్ఞ ఏదని అడిగెను. అందుకాయన నీ పూర్ణహృదయముతోను నీ పూర్ణాత్మతోను నీ పూర్ణమనస్సుతోను నీ దేవుడైన ప్రభువును ప్రేమింపవలెననునదియే. ఇది ముఖ్యమైనదియు మొదటిదియునైన ఆజ్ఞ. నిన్నువలె నీ పొరుగువాని ప్రేమింపవలెనను రెండవ ఆజ్ఞయు దానివంటిదే. **ఈ రెండు ఆజ్ఞలు ధర్మశాస్త్రమంతటికిని ప్రవక్తలకును ఆధారమైయున్నవని అతనితో చెప్పెను."**

పైన చెప్పిన విధంగా **"నీ పూర్ణహృదయముతోను నీ పూర్ణాత్మతోను నీ పూర్ణమనస్సుతోను నీ దేవుడైన ప్రభువును ప్రేమించడం మరియు నిన్నువలె నీ పొరుగువాని ప్రేమించడం"** అను రెండు ఆజ్ఞలు ధర్మశాస్త్రమంతటికిని, ప్రవక్తలకును ఆధారమైయున్నవని యేసుప్రభువు సెలవిచ్చారు.

ధర్మశాస్త్రమంతటికిని అంటే దేవుడు సెలవిచ్చిన ఆజ్ఞలన్నింటికి పై వచనాలే ఆధారం. అంటే మనం ఇంతకు ముందు చెప్పుకున్నట్లుగా **"దేవున్ని ప్రేమించడం, మన పొరుగువారిని ప్రేమించడం"** అనే విషయాన్ని ఆధారం చేసుకొని ఈ ఆజ్ఞలన్ని ఇవ్వడం జరిగిందని, అంతేగాకుండా ప్రవక్తలు చెప్పిన విషయాలకు కూడా ఇదే ఆధారమని పై వాక్యం బోధిస్తోంది. ప్రవక్తలు చెప్పిన విషయాలు అంటే దేవునిచే బోధింపబడిన విషయాలే గదా! బైబిలులో చెప్పిన విషయాలన్నీ దేవుని ఆత్మచే బోధింపబడినవే గదా! అంటే ప్రవక్తలు చెప్పిన విషయాలు అంటే బైబిలులో చెప్పిన సంగతులన్నీ అని అర్థమవుతోంది కదా!

బైబిల్‌లో చెప్పబడిన సంగతులన్నీ కూడా పై రెండు ఆజ్ఞలను ఆధారం చేసుకొనే చెప్పబడ్డాయి అని స్పష్టంగా బోధపడుతోంది. ఒకసారి నిర్గమకాండములోని 20వ అధ్యాయములో చెప్పబడిన పది ఆజ్ఞలను ఒకసారి పరిశీలిద్దాం!

**1) నేను తప్ప నీకు వేరొక దేవుడు ఉండకూడదు**

**2) ఏ విగ్రహములకు సాగిలపడకూడదు**

**3) యెహోవా నామమును వ్యర్థముగా ఉచ్చరింపకూడదు**

**4) విశ్రాంతి దినమును పరిశుద్ధముగా ఆచరింపవలెను**

**5) నీ తల్లిదండ్రులను సన్మానింపవలెను**

**6) నరహత్య చేయకూడదు**

**7) వ్యభిచరించకూడదు**

**8) దొంగిలకూడదు**

**9) నీ పొరుగువాని మీద అబద్ధ సాక్ష్యం పలుకకూడదు**

**10) నీ పొరుగువానిదేదైనను ఆశింపకూడదు**

పైన చెప్పబడిన పది ఆజ్ఞలలో మొదటి మూడు దేవునికి సంబంధించినవైతే, మిగతా ఏడు మన పొరుగువారికి సంబంధించినవి. రోమా 13వ అధ్యాయం ప్రకారం మనం మన పొరుగువారిని ప్రేమించడం ద్వారా వారికి కీడు చేయకుండా ఉంటామని చదువుకున్నాము.

దేవుని విషయంలో తప్ప మిగిలిన అన్ని విషయాలలో **'నిన్ను వలె నీ పొరుగువాని ప్రేమించడం'** అనే సిద్ధాంతము మీదనే బోధచేయబడింది. అంటే మన పొరుగువారితో ఏ సందర్భంలో ఎలా నడుచుకోవాలి? ఎలా నడుచుకోవద్దు? ఆ ప్రేమలో ఎదగడానికి ఏం చేయాలి? ఇలాంటి విషయాలతోనే మన బైబిల్ గ్రంథమంతా వ్రాయబడింది.

ఈ సిద్ధాంతాన్ని నిరూపించడానికి ఉదాహరణగా పాతనిబంధనా గ్రంథము నుండి ఒక విషయాన్ని, క్రొత్త నిబంధనా గ్రంథము నుండి ఒక విషయాన్ని తీసుకొని ఈ సిద్ధాంతమే ఆధారమని నిరూపించే ప్రయత్నం చేద్దాం.

యెషయా గ్రంథములో చెప్పబడిన ఉపవాసము గురించి ధ్యానిద్దాం!

సాధారణంగా ఉపవాసము అంటే ఏమిటో? ఎలా చెయ్యాలో మనకు తెలిసిన విషయమే. (నాకు ఎదురైన అనుభవాన్ని ఇక్కడ ప్రస్తావిస్తున్నాను, అంతటా ఇదే విధంగా జరుగుతుందని నేను చెప్పడం లేదని గమనించగలరు). మన సంఘాలలో ప్రతి శుక్రవారం ఉపవాస ప్రార్థనలు జరుగడం సర్వసాధారణం. ఆ రోజు ఉదయాన్నే 6 గంటలకు లేచి తలస్నానం చేసి తెల్ల బట్టలు ధరించుకొని ఒక గ్లాసు పాలు, కాసేపయ్యాక ఒక గ్లాసు పండ్ల రసం తాగేసి 9 గంటల కల్లా సంఘానికి చేరుకుంటాము. అక్కడ పాస్టర్ గారితోను ఇతర సంఘస్తులతోనూ కూర్చొని పాటలు పాడుతూ, దేవుని స్తుతిస్తూ సంఘక్షేమాభివృద్ధి కోసం, రోగుల కోసం, విద్యార్థుల కోసం, ఉద్యోగస్తుల కోసం, వ్యాపారస్తుల కోసం, నిరుద్యోగుల కోసం, అధికారుల కోసం, దేశం కోసం, మన రాష్ట్రం కోసం, మన జిల్లా, మన ప్రాంతం కోసం విజ్ఞాపన ప్రార్థనలు చేస్తాము. ఆ తర్వాత 11 గంటలకు ముగించుకొని ఇంటికి వెళ్లి వెంటనే భోజనం చేసేస్తాము. కొన్ని సంఘాలలో ఇంకా కఠినంగా ఉపవాసం ఉండి ప్రార్థిస్తారు. సరే ఎవరు ఎలా చేసినా మన దృష్టిలో ఉపవాసము అంటే భోజనము చేయకుండా ఉండడం. అలా భోజనం చేయకుండా దేవున్ని బ్రతిమాలుకుంటే మన ప్రార్థనలు త్వరగా ఆలకిస్తాడని మన గట్టి నమ్మకం. అంతేగదా!

ఉపవాసం అనే పదానికి శబ్దార్థం చూసినట్లయితే, ఉప అనగా సమీపము, వాసం అంటే వసించడం. అంటే **'సమీపంగా ఉండడం'** అని అర్థం.

నిజానికి దేవుని దృష్టిలో ఉపవాసం అంటే ఏమిటో? ఎలా ఉండాలో ఈ క్రింది వచనాలను చదివితే మనకు అర్థమైపోతుంది.

యెషయా 58:2-11 -''తమ దేవుని న్యాయవిధిని విడువక నీతిని అనుసరించువారైనట్టు అనుదినము వారు నాయొద్ద విచారణ చేయుచు నా మార్గములను తెలిసికొనన నిచ్ఛ కనుపరచుదురు తమకు న్యాయమైన తీర్పులు తీర్చవలెనని వారడు గుదురు దేవుడు తమకు ప్రత్యక్షుడు కావలెనని యిచ్ఛ యింతురు. మేము ఉపవాసముండగా నీవెందుకు చూడవు? మేము మా ప్రాణములను ఆయాసపరచుకొనగా నీవెందుకు లక్ష్యపెట్టవు? అని అందురు మీ ఉపవాసదినమున మీరు మీ వ్యాపారము చేయుదురు. మీ పనివారిచేత కఠినమైనపని చేయించుదురు. మీరు కలహపడుచు వివాదము చేయుచు అన్యాయముగా గుద్దులాడుచు ఉపవాసముందురు మీ కంఠధ్వని పరమున వినబడునట్లుగా మీరిప్పుడు ఉపవాసముండరు. అట్టి ఉపవాసము నాకనుకూలమా? మనష్యుడు తన ప్రాణమును బాధపరచుకొనవలసిన దినము అట్టిదేనా? ఒకడు జమ్మువలె తలవంచుకొని గోనెపట్ట కట్టుకొని బూడిదె పరచుకొని కూర్చుండుట ఉపవాసమా? అట్టి ఉపవాసము యెహోవాకు ప్రీతికరమని మీరను కొందురా?

**దుర్మార్గులు కట్టిన కట్లను విప్పుటయు కాడిమాను మోకులు తీయుటయు బాధింపబడినవారిని విడిపించుటయు ప్రతి కాడిని విరుగగొట్టుటయు నే నేర్పరచుకొనిన ఉపవాసము గదా? నీ ఆహారము ఆకలిగొనిన వారికి పెట్టుటయు నీ రక్త సంబంధికి ముఖము తప్పింపకుండుటయు దిక్కుమాలిన బీదలను నీ యింట చేర్చుకొనుటయు, వస్త్రహీనుడు నీకు కనబడినప్పుడు వానికి వస్త్రము లిచ్చుటయు ఇదియే గదా నాకిష్టమైన ఉపవాసము.**

ఆలాగున నీవు చేసినయెడల నీ వెలుగు వేకువ చుక్క వలె ఉదయించును స్వస్థత నీకు శీఘ్రముగా లభించును నీ నీతి నీ ముందర నడచును యెహోవా మహిమ నీ సైన్యపు వెనుకటి భాగమును కావలికాయును. అప్పుడు నీవు పిలువగా యెహోవా ఉత్తర మిచ్చును నీవు మొఱ్ఱపెట్టగా ఆయన నేనున్నాననును. **ఇతరులను బాధించుటయు వ్రేలుపెట్టి చూపి తిరస్కరించుటయు చెడ్డదానినిబట్టి**

**మాటలాడుటయు నీవు మాని, ఆశించినదానిని ఆకలిగొనినవానికిచ్చి శ్రమపడినవానిని తృప్తిపరచినయెడల చీకటిలో నీ వెలుగు ప్రకాశించును అంధకారము నీకు మధ్యాహ్నమువలె నుండును.** యెహోవా నిన్ను నిత్యము నడిపించును క్షామకాలమున ఆయన నిన్ను తృప్తిపరచి నీ యెముకలను బలపరచును నీవు నీరు కట్టిన తోటవలెను ఎప్పుడును ఉబుకుచుండు నీటి ఊటవలెను ఉండెదవు."

**పై వచనాలలో దేవుడు ఏర్పరచుకొనిన ఉపవాసంలో ఎక్కడా కూడా భోజనం మానేయమని చెప్పలేదు సరికదా, అలా భోజనం మానేసి, గోనెపట్ట గట్టుకొని, బూడిద పరచుకొని కూర్చుండుట ద్వారా తాను సంతోషిస్తానని, తనకు ప్రీతికరమని ఎలా అనుకుంటున్నారని మందలిస్తున్నాడు.**

"దుర్మార్గులు కట్టిన కట్లను విప్పుటయు కాడిమాను మోకులు తీయుటయు బాధింపబడినవారిని విడిపించుటయు ప్రతి కాడిని విరుగగొట్టుటయు నే నేర్పరచుకొనిన ఉపవాసము గదా? నీ ఆహారము ఆకలిగొనిన వారికి పెట్టుటయు నీ రక్త సంబంధికి ముఖము తప్పింపకుండుటయు దిక్కుమాలిన బీదలను నీ యింట చేర్చుకొనుటయు, వస్త్రహీనుడు నీకు కనబడినప్పుడు వానికి వస్త్రము లిచ్చుటయు ఇదియే గదా నాకిష్టమైన ఉపవాసము."

పైన చెప్పబడిన వచనాలలో ఎవరి కట్లను విప్పమన్నాడు? ఎవరిని విడిపించమన్నాడు? ఎవరి కాడిని విరగగొట్టమన్నాడు? ఆహారము ఎవరికి పెట్టమన్నాడు? ఎవరికి ముఖము తప్పించొద్దన్నాడు? ఎవరిని ఇంట చేర్చుకోమన్నాడు? ఎవరికి వస్త్రములియ్యమన్నాడు? మన పొరుగువారికే గదా! మరి ఎందుకలా చెయ్యమన్నాడు? పొరుగువారి మీద ప్రేమ చూపుటకే గదా!

అంటే వాక్యానుసారంగా ఉండే **'ఉపవాసములో నీ పొరుగు వారిని ప్రేమించడమనే'** అంశమే దాగివుంది. కాదంటారా?

ఇక మరొక ఉదాహరణ క్రొత్త నిబంధనలో నుండి తీసుకుందాం!

సంఘముగా కూడుకొనుటలో దేవుని యొక్క ముఖ్యోద్దేశ్యాన్ని గమనిద్దాం!

హెబ్రీయులకు వ్రాసిన పత్రిక 10వ అధ్యాయములో ఈ క్రింది వచనాలు చదువుదాం;

హెబ్రీ 10:24, 25 –"కొందరు మానుకొనుచున్నట్టుగా, సమాజముగా కూడుట మానక, **ఒకనినొకడు హెచ్చరించుచు,** ఆ దినము సమీపించుట మీరు చూచినకొలది మరి యెక్కువగా ఆలాగు చేయుచు, **ప్రేమ చూపుటకును సత్కార్యములు చేయుటకును ఒకనినొకడు పురికొల్పవలెనని** (మూలభాషలో– లేపవలెనని) ఆలోచింతము."

పై వచనాలను గమనించినట్లయితే, ఒకనినొకడు హెచ్చరించుటకు, ప్రేమ చూపుటకు, సత్కార్యములు చేయుటకు పురికొల్పుటకు సమాజముగా కూడుకోవాలని వాక్యం బోధిస్తోంది.

మనం ఎవరిని హెచ్చరించాలి? ఎవరిని పురికొల్పాలి? మన పొరుగువారినే కదా, అంటే మన సహోదరులనే గదా! మరి ఎందుకని అలా చెయ్యాలి? మనందరం పొరుగువారి మీద ప్రేమ చూపడంలో ఎదగడానికే గదా!

ఇందులో కూడా నీ పొరుగువారిని ప్రేమించడమనే అంశం దాగి వుంది. కాదంటారా?

ఇలా ఎన్ని ఉదాహరణలు తీసుకున్నా **'పొరుగువారికి కీడు చేయకుండా ఉండడం, పొరుగువారిని ప్రేమించడం, ఆ ప్రేమలో ఎదగడం'** లాంటి అంశాలే అందులో అంతర్లీనంగా ఉంటాయి.

కాబట్టి మన పొరుగువారిని ప్రేమించడంలోనే మన క్రైస్తవ జీవితం సార్థకమవుతుంది.

ఒకసారి పేతురు వ్రాసిన రెండవ పత్రికలో చెప్పబడిన ఈ క్రింది వచనాలను చదువుదాం;

2 పేతురు 1:2-11 –"తన మహిమనుబట్టియు, గుణాతిశయమునుబట్టియు, మనలను పిలిచినవాని గూర్చిన అనుభవజ్ఞానమూలముగా ఆయన దైవశక్తి, జీవమునకును భక్తికిని కావలసినవాటినన్నిటిని మనకు దయచేయు చున్నందున, దేవునిగూర్చినట్టియు మన ప్రభువైన యేసునుగూర్చినట్టియునైన అనుభవ

జ్ఞానమువలన మీకు కృపయు సమాధానమును విస్తరించును గాక. ఆ మహిమ గుణాతిశయములనుబట్టి ఆయన మనకు అమూల్యములును అత్యధికములునైన వాగ్దానములను అనుగ్రహించియున్నాడు. దురాశను అనుసరించుటవలన లోకమందున్న భ్రష్టత్వమును ఈ వాగ్దానముల మూలముగా మీరు తప్పించుకొని, దేవస్వభావమునందు పాలివారగునట్లు వాటిని అనుగ్రహించెను.

ఆ హేతువుచేతనే మీమట్టుకు మీరు పూర్ణ జాగ్రత్తగలవారై, మీ **విశ్వాసమునందు సద్గుణమును, సద్గుణమునందు జ్ఞానమును, జ్ఞానమునందు ఆశానిగ్రహమును, ఆశానిగ్రహము నందు సహనమును, సహనమునందు భక్తిని, భక్తియందు సహోదరప్రేమను, సహోదర ప్రేమయందు దయను (ప్రేమను)** అమర్చుకొనుడి.

ఇవి మీకు కలిగి విస్తరించినయెడల అవి మన ప్రభువైన యేసుక్రీస్తును గూర్చిన అనుభవజ్ఞాన విషయములో మిమ్మును సోమరులైనను నిష్ఫలులైనను కాకుండ చేయును. ఇవి ఎవనికి లేకపోవునో వాడు తన పూర్వపాపములకు శుద్ధి కలిగిన సంగతి మరచిపోయి, గ్రుడ్డివాడును దూరదృష్టిలేనివాడునగును. అందువలన సహోదరులారా, **మీ పిలుపును ఏర్పాటును నిశ్చయము చేసికొనుటకు మరి జాగ్రత్తపడుడి.** మీరిట్టి క్రియలు చేయువారైతే ఎప్పుడును తొట్రిల్లరు. ఆలాగున మన ప్రభువును రక్షకుడునైన యేసుక్రీస్తు యొక్క నిత్యరాజ్యములో ప్రవేశము మీకు సమృద్ధిగా అనుగ్రహింపబడును."

ఇవి లేనివాడు తమ పిలుపును ఏర్పాటును నిశ్చయము చేసుకొనమని చెబుతున్నాడు. అంటే మీరు నిజంగా **'పిలువబడ్డారా'** అనే విషయాన్ని నిశ్చయం చేసుకోమని అంటున్నాడు. ఇది అసలుకే ఎసరొచ్చేలా ఉంది, జాగ్రత్త సుమీ!

చివరగా, మార్కు సువార్త 12వ అధ్యాయంలోని ఈ క్రింది వచనాలను ధ్యానించుకుందాం;

మార్కు 12:28-34 –**"శాస్త్రులలో ఒకడు వచ్చి, వారు తర్కించుట విని, ఆయన వారికి బాగుగా ఉత్తరమిచ్చెనని గ్రహించి- ఆజ్ఞలన్నిటిలో ప్రధానమైనదేదని ఆయన నడిగెను. అందుకు యేసు** -ప్రధానమైనది ఏదనగా -ఓ ఇశ్రాయేలూ, **వినుము;** మన దేవుడైన ప్రభువు అద్వితీయ ప్రభువు. నీవు నీ **పూర్ణహృదయముతోను, నీ పూర్ణబలముతోను,** నీ దేవుడైన ప్రభువును ప్రేమింపవలెననునది ప్రధానమైన **ఆజ్ఞ.** రెండవది, నీవు నిన్నువలె నీ పొరుగువానిని ప్రేమింపవలెననునది రెండవ **ఆజ్ఞ; వీటికంటె ముఖ్యమైన ఆజ్ఞ మరేదియు లేదని అతనితో చెప్పెను.**

**ఆ శాస్త్రి బోధకుడా, బాగుగా చెప్పితివి; ఆయన అద్వితీయుడనియు, ఆయన తప్ప వేరొకడు లేడనియు** నీవు చెప్పిన మాట సత్యమే. **పూర్ణహృదయముతోను, పూర్ణ**వివేకముతోను, **పూర్ణబలముతోను ఆయనను** ప్రేమించుటయు, **ఒకడు తన్నువలె తన పొరుగువాని** ప్రేమించుటయు సర్వాంగ హోమములన్నిటి **కంటెను బలులకంటెను అధికమని ఆయనతో చెప్పెను. అతడు వివేకముగా నుత్తరమిచ్చెనని యేసు** గ్రహించి-**నీవు దేవుని రాజ్యమునకు దూరముగ లేవని అతనితో చెప్పెను."**

పై వచనాన్ని ప్రార్థనా పూర్వకంగా ధ్యానించండి. దేవుడు మిమ్ములను బహుగా దీవించును గాక!



# COVER STORY




## Qumran Caves–Bible Scrolls found in Clay Jars

*Qumran is famous as the hiding place of the Dead Sea Scrolls, a literary treasure trove hidden since shortly after the time of Christ.*

*The site is north-west of the Dead Sea, about 15km south of Jericho and about 1.5km west of the road that runs along the western shore of the Dead Sea.*

*A Bedouin goat- or sheep-herder by the name of Mohammed Ahmed el-Hamed found the first scrolls in 1947, when he threw a rock into a cave in an attempt to drive out a missing animal. The sound of breaking pottery drew him into the cave, where he found seven clay jars containing scrolls that had been wrapped in linen for nearly 2000 years.*

*Eventually, fragments of about 850 scrolls were found in 11 of the hard-to-reach caves that pockmark the cliffs of the Qumran area. A 12th cave, its contents looted, was found in 2017.*

*The ancient manuscripts were in various states of completeness. Only a handful were intact, the largest more than 8 metres long. Most were written in Hebrew, some in Aramaic and a few in Greek. Most were on parchment, with a few on papyrus. They had been preserved by the hot, dry desert climate.*

*The scrolls include at least fragments of every book of the Old Testament except the book of Esther. The oldest existing copies of the Old Testament, they generally confirm the accuracy of later manuscripts. Other scrolls also give a new insight into the Jewish society in which Christianity began.*

### Essenes were 'unique and admirable'

*Who hid the scrolls at Qumran? Academics have hotly debated this question. The prevalent view is that the scrolls were written or copied by a devout group of Essenes, a strict Jewish sect formed in reaction to what they saw as religious laxity in Judaism.*

*The Essenes at Qumran lived an austere lifestyle in their remote desert surroundings. Study of the Jewish Law went on in shifts around the clock.*

*The community gained the admiration of the Roman statesman Pliny the Elder, who wrote: @They are unique and admirable beyond all other peoples in that they have no women, no sexual desire, no money, and only palm trees for company. Owing to the influx of newcomers, they are daily reborn in equal numbers.@*

*The Essenes believed the end of the world was imminent. They never married because they wanted to be ritually pure when the Messiah appeared.*



### No scrolls mention Christ

*The Qumran community was driven from its wilderness retreat by the Romans in AD 68, leaving its library of scrolls hidden in caves for safe-keeping.*

*Although the Essenes existed during the time of Christ, none of the scrolls refer to him or to any other New Testament personality.*

*Ruins of the sect@s communal site remain, including a watchtower, a dining hall, cisterns and cemeteries.*



Source : seetheholyland.net

*Visitors can watch a short film on the Essenes and view a small exhibition before going to the archaeological site. From there, the caves above can be seen.*

*Where are the scrolls now? Most are in Jerusalem (eight at the Shrine of the Book, where pages are regularly on display, and the others at the Rockefeller Museum). Some are in Jordan and Europe.*




# మీకు తెలుసా

## టెంప్లమ్ డొమిని గురించి మీకు తెలుసా?

**'టెంప్లమ్ డొమిని'** అంటే **'లార్డ్ టెంపుల్'** అని అర్థం. క్రీ.శ.1099లో క్రూసేడర్స్ జెరూసలేంను స్వాధీనం చేసుకున్న తర్వాత **'డోమ్ ఆఫ్ ది రాక్'** ను క్రైస్తవ చర్చిగా మార్చి దానికి ఆ పేరు పెట్టారు. ఇది జెరూసలేం యొక్క ఒక ముఖ్యమైన చిహ్నంగా మారింది, ఇది క్రైస్తవ రాజ్యమైన జెరూసలేంలో అధికారికంగా ముద్రించిన నాణేలపై చిత్రీకరించబడింది.



7వ శతాబ్దం చివరలో 5వ ఉమయ్యద్ కాలిఫ్ అబ్దుల్-మాలిక్ ఇబ్న్ మర్వాన్ ఆధ్వర్యంలో యూదుల రెండవ ఆలయం ఉన్న స్థలంలో డోమ్ ఆఫ్ ది రాక్ నిర్మించబడింది (లేదా హెరాక్లియస్ (క్రీ.శ.610-641) పాలనలో ఉన్న బైజాంటైన్ భవనం). మొదటి క్రూసేడ్‌లో (క్రీ.శ.1099) జెరూసలేంను స్వాధీనం చేసుకున్న తరువాత, డోమ్ ఆఫ్ ది రాక్ అగస్టీనియన్ కానన్స్ లేదా ఆస్టిన్ కేనన్స్ సంరక్షణలో ఉంచబడింది, అతను దానిని క్రైస్తవ చర్చిగా మార్చాడు.

ప్రక్కనే ఉన్న అల్-అక్సా మసీదును క్రూసేడర్స్ **టెంప్లమ్ సోలమోనిస్ (టెంపుల్ ఆఫ్ సోలమన్)** అని పిలిచారు. ఇది మొదట రాజభవనంగా మారింది. "సొలొమోను ఆలయం"కు ప్రాతినిధ్యం వహిస్తున్న డోమ్ యొక్క చిత్రం, జెరూసలేం రాజ్యంలో ఒక ముఖ్యమైన ఐకానోగ్రాఫిక్ అంశంగా మారింది. డేవిడ్ టవర్, చర్చ్ ఆఫ్ ది హెూలీ సెపల్చర్, డోమ్ ఆఫ్ ది రాక్ మరియు నగర గోడలను కలపడం ద్వారా జెరూసలేం రాజుల రాజ ముద్రలు నగరాన్ని ప్రతీకగా చిత్రీకరించాయి.




జాఫా గేట్ దగ్గర నిర్మించిన రాజభవనం పూర్తయిన తరువాత, జెరూసలేం రాజు ఈ భవనాన్ని నైట్స్ టెంప్లర్ (Knights Templar -క్రీ.శ.1119 ఏర్పడ్డ ఒక క్రైస్తవ యోధుల సంఘం?) కు ఇచ్చాడు, వారు దీనిని తమ ప్రధాన కార్యాలయంగా ఉపయోగించారు. గ్రాండ్ మాస్టర్స్ ఆఫ్ ది నైట్స్ టెంప్లర్ (ఎవెరార్డ్ డెస్ బారెస్ మరియు రెనాడ్ డి విచియర్స్ లాంటివారు) యొక్క ముద్రల వెనుక భాగంపై డోమ్ గుర్తు సూచించబడింది. ఇది యూరప్‌లోని రౌండ్ టెంప్లర్ చర్చిలకు నిర్మాణ నమూనాగా మారింది.



క్రూసేడర్ కాలంలో ప్రక్కనే ఉన్న డోమ్ ఆఫ్ అసెన్షన్ (Dome of the Ascension) బాప్టిస్ట్రీగా నిర్మించబడినప్పటికీ, అప్పటి నుండి ఇది డోమ్ ఆఫ్ ది రాక్ యొక్క పెద్ద సముదాయంలో భాగంగా ఇస్లామిక్ అధికారుల చేతిలో ఉంది.

Source : wikipedia

# సమకాలీన ఇశ్రాయేలు



## ఇశ్రాయెల్ నూతన ప్రధాని నఫ్తాలి బెన్నెట్

ఇశ్రాయెల్‌లో కొత్త సంకీర్ణ ప్రభుత్వం ఏర్పడటంతో 12 ఏళ్ల కాలంపాటు ఇశ్రాయెల్ ప్రధానిగా కొనసాగిన **బెంజమిన్ నెతన్యాహు** పదవీచ్యుతుడయ్యారు. ఇశ్రాయెల్ 13వ ప్రధానిగా యామినా పార్టీ అధ్యక్షుడు **నఫ్తాలీ బెన్నెట్** (49) ఎన్నికయ్యారు. జూన్ 13, 2021 ఆదివారం రోజున ఆయన ప్రధానిగా ప్రమాణస్వీకారం చేశారు. పరస్పర విరుద్ధ సిద్ధాంతాలు, భావజాలాలతో కూడిన ఎనిమిది పార్టీల సంకీర్ణ ప్రభుత్వానికి బెన్నెట్ నేతృత్వం వహిస్తున్నారు. ఇశ్రాయెలీ అరబ్ పార్టీ సంకీర్ణంలో చేరడం దశాబ్దాల తర్వాత ఇది మొదటిసారి. ఏ ఒక్క పార్టీకి స్పష్టమైన మెజారిటీ రాకపోవడంతో గడిచిన రెండేళ్లలో ఇశ్రాయెల్‌లో నాలుగుసార్లు ఎన్నికలు జరిగాయి. 120 సభ్యులుగల ఇశ్రాయెల్ నెస్సెట్‌లో (పార్లమెంటు) ఈ కూటమికి సరిగ్గా సాధారణ మెజారిటీ (61) ఉంది.

మార్చి 13, 2021లో జరిగిన ఎన్నికల్లో నెతన్యాహు పార్టీ లికుడ్‌కు కేవలం 30 సీట్లు మాత్రమే వచ్చాయి. మెజారిటీని కూడగట్టడంలో నెతన్యాహు విఫలం కావడంతో ఇశ్రాయెల్ అధ్యక్షుడు **రువెన్ రివ్లిన్** రెండో అతిపెద్ద పార్టీ అయిన యెష్ అటిడ్ (17 సీట్లు) అధినేత లాపిడ్‌ను ప్రభుత్వ ఏర్పాటుకు ఆహ్వానించారు. అయితే లాపిడ్, బెన్నెట్ మధ్య కుదిరిన ఒప్పందం ప్రకారం, తొలుత నఫ్తాలీ బెన్నెట్ ప్రధానిగా బాధ్యతలు చేపట్టారు. అయితే కొత్త ప్రధాని బెన్నెట్ 2023 సెప్టెంబర్ వరకు పదవిలో కొనసాగుతారు. ఆ తర్వాత యెష్ అతీద్ నాయకుడు **యెయిర్ లాపిడ్‌కు** అధికారాన్ని అప్పగిస్తారు. లాపిడ్ మరో మరో రెండేళ్లపాటు పాలన కొనసాగిస్తారు. బెన్నెట్ మంత్రివర్గంలో తొమ్మిది మంది మహిళలతో సహా మొత్తం 27 మంది మంత్రులు ఉన్నారు.

నెతన్యాహూ ప్రధాని పదవి నుంచి వైదొలిగినప్పటికీ, మితవాద పార్టీ లికుడ్‌కు అధ్యక్షుడిగా

**ఈ క్రింది (8) పార్టీలు కలిసి సంకీర్ణ ప్రభుత్వాన్ని ఏర్పాటు చేశాయి**

| పార్టీ | ఐడియాలజీ | నాయకుడు | పొందిన సీట్లు |
|---|---|---|---|
| యెష్ అతిద్ | ఉదారవాదం | యాయిర్ లాపిడ్ | 17/120 |
| బ్లూ & వైట్ | సామాజిక ఉదారవాదం | బెన్నీ గాంట్జ్ | 8/120 |
| యామినా | జాతీయ సంప్రదాయవాదం | నఫ్తాలీ బెన్నెట్ | 6/120 |
| లేబర్ | సామాజిక ప్రజాస్వామ్యం | మెరావ్ మిఖాయేలి | 7/120 |
| ఇశ్రాయెల్ బెయితెయిను | జాతీయవాదం | అవిగ్డోర్ లియెబెర్మన్ | 7/120 |
| న్యూ హోప్ | జాతీయ ఉదారవాదం | గిడియోన్ సార్ | 6/120 |
| మెరెట్జ్ | సామాజిక ప్రజాస్వామ్యం | నిట్జన్ హెూరోవిట్జ్ | 6/120 |
| రామ్ | ఇస్లాంమతవాదం | మన్సూర్ అబ్బాస్ | 4/120 |

Source : Wikipedia / Sakshi / tv9telugu / BBC

కొనసాగుతూ పార్లమెంటులో ప్రధాన ప్రతిపక్ష నాయకుడుగా వ్యవహరిస్తారు. నెతన్యాహూ సుదీర్ఘ కాలం పాటూ ఇజ్రాయెల్‌లో ప్రభుత్వం నడిపారు. ఐదుసార్లు ప్రధానిగా ఎన్నికయ్యారు. 1996 నుంచి 1999 వరకు ఆయన తొలిసారి ప్రధానిగా ప్రభుత్వాన్ని నడిపించారు. ఆ తరువాత 2009 నుంచి 2021 వరకు ప్రధానిగా వ్యవహరించారు. ఈసారి ఎన్నికల్లో ఎనిమిది పార్టీలతో ఏర్పడిన సంకీర్ణ కూటమికి మెజారిటీ లభించడంతో నెతన్యాహూ ఓటమి చవిచూడాల్సి వచ్చింది.

నెతన్యాహును పదవిలోంచి తప్పించాలనే కోరికే ప్రతిపక్షాలను ఐక్యం చేసింది. అయితే, ఇజ్రాయెల్‌లో కొత్తగా ఏర్పడిన ప్రభుత్వాన్ని 'ఈ శతాబ్దపు కుట్ర' అని నెతన్యాహు అభివర్ణించారు. కొత్తగా ఏర్పడిన సంకీర్ణం అత్యంత ప్రమాదకరమైందని, అది ఇజ్రాయెల్‌ను, ప్రజలను, సైనికులను ప్రమాదంలోకి నెట్టేస్తుందని ఆయన వ్యాఖ్యానించారు.

నెతన్యాహూ కన్నా నాఫ్తాలిని అతివాద జాతీయవాదిగా పరిగణిస్తారు. ఇజ్రాయెల్ యూదుల దేశంగా మాత్రమే ఉండాలని నాఫ్తాలి భావిస్తారు. వెస్ట్ బ్యాంక్, తూర్పు జెరూసలెం, సిరియన్ గోలన్ హైట్స్ కూడా యూదు దేశంలో భాగమని ఆయన విశ్వసిస్తారు. ఇటీవల ఇజ్రాయెల్, పాలస్తీనియన్లకు మధ్య జరిగిన ఘర్షణల నేపథ్యంలో ఇజ్రాయెల్‌లో కొత్త ప్రభుత్వం ఏర్పడడం ఆ దేశ రాజకీయాలకు కీలకం కానుంది.




## నఫ్తాలీ బెన్నెట్ గురించి క్లుప్తంగా :

నఫ్తాలీ బెన్నెట్ మార్చి 25, 1972లో ఇజ్రాయెల్‌లోని హైఫా నగరంలో జిమ్ బెన్నెట్-మిర్నా బెన్నెట్‌లకు మూడవ (చివరి) సంతానంగా జన్మించారు. ఆషేర్ బెన్నెట్, డానియేల్ బెన్నెట్‌లు అతని ఇద్దరు సహోదరులు. అమెరికాలో ఉండే జిమ్ బెన్నెట్ కుటుంబం 1967లో ఇజ్రాయెల్‌కు వచ్చి స్థిరపడింది. అమెరికాలోనూ, ఇజ్రాయెల్‌లోనూ బెన్నెట్ విద్యాభ్యాసం సాగింది. ఇజ్రాయెల్‌లోని సురక్షితమైన, అందమైన నగరమైన టెల్ అవీవ్‌లో బెన్నెట్ నివసిస్తున్నారు. అతను మిలిటరీలో ఉండి, తరువాత న్యాయ విద్యార్థి అయ్యారు. తరువాత ప్రైవేట్ రంగంలో ప్రవేశించారు. అతను ఆధునిక, మత జాతీయవాది అని అందరూ అంటారు.



1999లో సహవ్యవస్థాపకుడుగా CYOTA అను సాఫ్ట్‌వేర్ సంస్థను స్థాపించి సీఈవోగా వ్యవహరించి సాఫ్ట్‌వేర్ ఎంటర్‌ప్రెన్యూర్‌గా విజయం సాధించారు. 2005లో తన కంపెనీని అమెరికాకు చెందిన ఆర్ఎస్ఏ సెక్యురిటీస్‌కు 145 మిలియన్ డాలర్లకు అమ్మేశారు. పేస్ట్రీ చెఫ్‌గా, పేరెంట్ కౌన్సిలర్‌గా వ్యవహరించే **'గిలాట్'**ను 1999లో నఫ్తాలీ బెన్నెట్ వివాహమాడారు. వారికి నలుగురు సంతానం కలిగారు.

2006లో, ఇజ్రాయెల్, లెబనీస్ ఉగ్రవాద సంస్థ హిజ్బుల్లా మధ్య యుద్ధం జరిగినప్పుడు, రాజకీయాల్లోకి రావాలని నిర్ణయించుకున్నానని బెన్నెట్ చెప్పారు. యుద్ధం ఎటువంటి ఫలితాలను ఇవ్వలేదు, కానీ ఇజ్రాయెల్ సైన్యం, ప్రభుత్వం దేశంలో విమర్శలను ఎదుర్కొన్నాయి. ఇజ్రాయెల్ వార్తాపత్రిక 'హెరాట్జ్' కాలమిస్ట్ యాంచెల్ ఫైఫర్ ఇలా అన్నారు -"బెన్నెట్ జాతీయవాది, కానీ మొండివాడు కాదు. మతపరమైనవాడు, కానీ మతోన్మాది కాదు. టెక్ వ్యవస్థాపకులు, వారి సంస్థల ద్వారా మిలియన్ డాలర్లు సంపాదిస్తారు. అతని రాజకీయ ఇన్నింగ్స్ చాలా కాలం ఉండకపోవచ్చు."

(...మిగతా 15వ పేజీలో)




# Strong's నెంబర్లతో కూడిన తెలుగు బైబిల్ తర్జుమా

ప్రియమైన తెలుగు క్రైస్తవ సహోదరులకు ప్రభువైన యేసు క్రీస్తు నామములో శుభాభివందనాలు. 2008లో నేను మొదటిసారి కింగ్ జేమ్స్+ వెర్షన్‌తో పాటు స్ట్రాంగ్స్ హెబ్రీ, గ్రీకు డిక్షనరీ చూడడం జరిగింది. అప్పుడే అనిపించింది మన మాతృభాషయైన తెలుగులో కూడా ఇలాంటి సౌలభ్యం ఉంటే ఎంతో బాగుంటుందని, బైబిల్ స్టడీకి ఎంతగానో వుపయోగపడుతుందని. 2009లో తెలుగులో స్ట్రాంగ్స్ నంబర్స్‌తో కూడిన బైబిలు తయారుచేయాలనే ఉద్దేశ్యంతో ఒక ప్రణాళికను సిద్ధం చేసుకున్నాము. ప్రభువు కృప వలన అది తప్పకుండా సాధ్యమవుతుందనే నమ్మకంతో ముందడుగు వేసాము. అందులో భాగంగా ముందుగా స్ట్రాంగ్స్ హిబ్రూ, గ్రీకు డిక్షనరీని ఆన్‌లైన్ ద్వారా డౌన్‌లోడ్ చేసుకొని సిద్ధం చేసుకున్నాము. ఆ తర్వాత డిక్షనరీలోని హెబ్రీ, గ్రీకు పదాలను తెలుగులోకి తర్జుమా చేయడం మొదలు పెట్టాము. ఇంత వరకు బాగానే నడుస్తోంది. ఇక అసలు కథ ముందుంది, స్ట్రాంగ్స్ నెంబర్లతో కూడిన తెలుగు అనువాదాన్ని సిద్ధం చేయడం. ఇందుకోసం ఒరిజినల్ హెబ్రీ మరియు గ్రీకు బైబిలులో లేదా కింగ్ జేమ్స్+ వెర్షన్‌లోని ప్రతి వచనములో ఎన్ని పదాలైతే ఉంటాయో అన్ని పదాలు ఆయా వచనాలలో తప్పకుండా ఉండేలా చూసుకుంటూ తెలుగు వ్యాకరణమునకు అనుగుణంగా తర్జుమా చేసి స్ట్రాంగ్స్ నెంబర్లు ఇవ్వాల్సి ఉంటుంది. ఇది ఎంత శ్రమతో కూడుకున్న పనో మీరు అర్థం చేసుకోవచ్చును. అంటే *KJV+ (King James Version with Strong's numbers), ASV+ (American Standard Version 1901 with Strong's numbers), HSB+ (Hebrew Study Bible with Strong's numbers), LXX+ (Septuagint with Strong's numbers), Orig+ (Bible in Original Languages with Strong's numbers)* మొదలైన బైబిల్ వెర్షన్‌లు మరియు *Gesenius' Hebrew and Chaldee Lexicon (Heinrich Friedrich Wilhelm Gesenius in 1812), Thayer's Greek Definitions (Joseph Henry Thayer in 1885), Strong's Dictionary (James Strong in 1890), BDB-Brown-Driver-Briggs' Hebrew Definitions (Francis Brown-Samuel Rolles Driver-Charles Augustus Briggs in 1906), TDNT-Theological Dictionary of New Testament-10 Vol (edited by Gerhard Kittel and Gerhard Friedrich translated by Geoffrey W. Bromiley in 1932), TDOT-Theological Dictionary of Old Testament-16 Vol (edited by G. Johannes Botterweck, Heinz–Josef Fabry, Helmer Ringgren in 1964), TWOT-Theological Word book of the Old Testament (Gleason L. Archer and R. Laird Harris in 1980)* లాంటి నిఘంటువులు గతంలో బైబిలు పండితులు ఎంతగా కష్టపడితే మనకు అందుబాటులోకి వచ్చాయో కదా! ప్రభువు నామానికి మహిమ కలుగును గాక!

అయితే ఇక్కడ మీకొక ముఖ్యమైన విషయం చెప్పాలి. మాలో ఎవరూ కూడా హెబ్రీ భాషలో గాని, గ్రీకు భాషలో గాని పండితులు కారు. కానీ ప్రస్తుతం మనకు అందుబాటులో ఉన్న నిఘంటువులను ఆధారం చేసుకొని ఈ తర్జుమాలు చేయడం జరుగుతోంది. మేము కేవలం **"కూర్పరులం' లేదా 'సంకలనకర్తలం"** మాత్రమే, భాషా పండితులం గాని, బైబిల్ పండితులం గాని కాదని

గమనించగలరు. మాకు తర్జుమా చేయాలనే దృఢసంకల్పం మరియు తెలుగు, హిందీ, ఇంగ్లీషు మరియు గ్రీకు, హెబ్రీ భాషలలో టైపింగ్ చేయగల సామర్థ్యం మాత్రం ఉన్నది. ఇందులో ఏమైనా దోషాలు ఉన్నట్లయితే మా దృష్టికి తీసుకొని వస్తే మేము తప్పకుండా సరిదిద్దడానికి సర్వదా సిద్ధముగా ఉన్నాము. **ఈ ప్రాజెక్టుపై మీ యొక్క అభిప్రాయాన్ని తప్పకుండా తెలియజేస్తారని, మమ్మల్ని పురికొల్పుతారని ఆశిస్తున్నాము.**

### బైబిల్ తర్జుమా క్రింది విధంగా ఉంటుంది

**2:11** మనిషి[444] యొక్క[1063] విషయాలు[3588] అతని[846] లోని[1722] మనిషి[444] ఆత్మకు[4151] గాక[1508] అవి[3588] ఏ[5101] మనిషికి[444] తెలుసు[1492]? కాబట్టి[3779] అలాగే[2532] దేవుని[2316] విషయాలు[3588] తెలుసుకున్నది[1492] ఎవరూ లేరు[3762], దేవుని[2316] ఆత్మ[4151] తప్ప[1508].

**2:12** దేవుని[2316] చేత[5259] మనకు[2254] ఉచితంగా ఇచ్చిన[5483] వాటిని[2443] తెలుసుకునేలా[1492] ఇప్పుడు[1161] మనము[2249] పొందుకున్నది[2983] లోక[2889] ఆత్మ[4151] కాదు[3756], కానీ[235] అది[3588] దేవుని[2316] యొక్క[1537] ఆత్మే[4151].

**2:13** ఆధ్యాత్మికమైనవి[4152] ఆధ్యాత్మికమైన వాటితో[4152] పోల్చుతూ[4793] ఏవైనా[3739] కూడా[2532] మేము మాట్లాడుతామో[2980], మనిషి యొక్క[442] జ్ఞానం[4678] లో[1722] బోధించే[1318] మాటలు[3056] కాదు[3756], కానీ[235] పవిత్ర[40] ఆత్మ[4151] లో[1722] బోధించేవే[1318].

దీన్ని సిద్ధపరచుటకు మాకు ఆలోచనను, జ్ఞానాన్ని, అవకాశాన్ని ఇచ్చిన యేసుక్రీస్తు ప్రభువుల వారికి సర్వదా కృతజ్ఞులం, అలాగే ఈ ప్రాజెక్టు కోసం ప్రార్థిస్తున్న వారికి, సహకరిస్తున్న సహోదరులందరికీ పేరు పేరున శుభాభివందనాలు. దేవుడు తన కృపా హస్తాన్ని మనకు తోడుగా ఉంచునుగాక! ఆమెన్.

**-ఎడిటర్**

*(13వ పేజీ తరువాయి...)* **...నఫ్తాలి బెన్నెట్**

2011లో క్రియాశీలక రాజకీయాల్లోకి ఆయన ప్రవేశించారు. బెన్నెట్ పాలస్తీనా స్వాతంత్ర్యాన్ని, దాని సృష్టిని వందల సార్లు బహిరంగంగా వ్యతిరేకించారు. వెస్ట్ బ్యాంక్, జెరూసలెంలో ఉన్నవి యూదుల స్థావరాలే అని చెబుతారు. బరాక్ ఒబామా అమెరికా అధ్యక్షుడిగా ఉన్నప్పుడు, యూదుల స్థావరాలను నిలువరించమని అప్పటి ప్రధాని నెతన్యాహును కోరినప్పుడు, బెన్నెట్ దానిని తీవ్రంగా వ్యతిరేకించారు. 2013లో ఎంపి కావడానికి ముందు వెస్ట్ బ్యాంక్ సెటిలర్స్ కౌన్సిల్‌కు చీఫ్‌గా కూడా బెన్నెట్ పనిచేశారు. ఇజ్రాయెల్ డెమోక్రసీ ఇన్‌స్టిట్యూట్ చీఫ్, బెన్నెట్‌కు మంచి స్నేహితుడు అయిన జోహన్ ప్లెస్నర్ మాట్లాడుతూ, భద్రతా విషయాలపై చాలా కఠినమైన వైఖరితో బెన్నెట్ బలమైన మితవాద నాయకుడనడంలో సందేహం లేదు, కానీ అతను కూడా చాలా ప్రాక్టికల్ అని చెప్పారు.

బెన్నెట్, 2013 నుండి ఇజ్రాయెల్ మంత్రివర్గంలో పనిచేశారు. ఆర్థిక మంత్రిగా, మతసేవల మంత్రిగా, డయాస్పోరా వ్యవహారాల మంత్రిగా, విద్యా మంత్రిగా, రక్షణ మంత్రిగా, సమాజ వ్యవహారాల మంత్రిగా పదవీ భాధ్యతలు చేపట్టారు.

49 ఏళ్ల బెన్నెట్ గతంలో నెతన్యాహుకు చాలా దగ్గరి సహాయకుడిగా ఉండేవాడు. కానీ తరువాత దూరం పెరిగింది. మధ్యప్రాచ్యానికి సంబంధించి నెతన్యాహు విధానంతో బెన్నెట్ ఏకీభవించరు. నెతన్యాహు అతన్ని చీఫ్ ఆఫ్ స్టాఫ్ చేశారు. నెతన్యాహు భార్య సారా యొక్క రాజకీయ జోక్యం కారణంగా, బెన్నెట్ ఆ పదవి నుండి తప్పుకున్నాడు. మార్చిలో ఒక టీవీ చర్చ సందర్భంగా, బెన్నెట్ ఇలా అన్నారు –“సెంట్రిస్ట్ పార్టీ నాయకుడు యెర్ లాపిడ్‌ను నేను ప్రధానిగా ఎప్పటికీ అనుమతించను.” ఆసక్తికరమైన విషయం ఏమిటంటే, నెతన్యాహును అధికారం నుండి తొలగించడానికి బెన్నెట్ ఇదే యెర్ లాపిడ్‌తో చేతులు కలపడమే కాకుండా కూటమి నిబంధనల ప్రకారం, యెర్ లాపిడ్ 2023 సెప్టెంబర్‌లో ప్రధాని అవుతారు.

# ఇశ్రాయేలు ఆధునిక చరిత్ర



ప్రవచనాత్మకంగా 1948లో ఏర్పడిన నూతన ఇశ్రాయేలు దేశము, తాను నిలదొక్కుకోడానికి శత్రువులను ఎదుర్కొనడానికి చేసిన యుద్ధాలు, ఆపరేషన్ల గురించి తెలుసుకోవడం ద్వారా దేవుడు వారికి ఎంతగా సాయం చేస్తున్నాడో మనం గ్రహించవచ్చు. దేవునికి మహిమకరంగా, చుట్టూ వున్న శత్రువులు ఆశ్చర్యపోయే రీతిగా ఉన్నటువంటి వారి యుద్ధాల గురించి, ఐడిఎఫ్, మొసాద్ చేపట్టిన ఆపరేషన్ల గురించి, ఐరన్ డోమ్, లేజర్ డోమ్‌ల గురించి రాబోయే సంచికలలో తెలుసుకుందాం. ఈ సంచికలో ప్రపంచంలోనే అతిపెద్ద శక్తివంతమైన మరియు ప్రతిభావంతమైన గూఢాచార సంస్థయైన ఇశ్రాయెల్ గూఢాచార సంస్థ 'మొసాద్' గురించి తెలుసుకుందాం.

## MOSSAD-(Institute for Intelligence and Special Operations)

**'మొసాద్'** అంటే హీబ్రూ భాషలో **'సంస్థ'** అని అర్థం. ఇది ఇశ్రాయేల్ దేశమునకు చెందిన జాతీయ గూఢాచార సంస్థ. ఇది ప్రపంచంలోనే అతిపెద్ద గూఢాచార సంస్థల్లో ఒకటి. డిసెంబర్ 13, 1949లో అప్పటి ఇశ్రాయేల్ ప్రధాని డేవిడ్ బెన్ గురియన్ దీనిని ఏర్పాటు చేశారు. దీని యొక్క మొదటి డైరెక్టర్ రూవెన్ షిలోహ్ (Reuven Shiloah). ప్రస్తుత డైరెక్టర్ డేవిడ్ బర్నియా (David Barnea), 13వ డైరెక్టర్. దీని యొక్క ప్రధాన కార్యాలయం టెల్‌అవీవ్‌లో ఉన్నది. ఈ సంస్థలో సుమారు 7,000 మంది సిబ్బంది పనిచేస్తున్నారు. ఈ సంస్థ ఇశ్రాయేల్ దేశములో ఉన్న మిలిటరీ ఇంటలిజెన్స్ ఏజెన్సీ (అమన్) మరియు అంతర్గత రక్షణ వ్యవస్థ (షీన్ బేత్)లతో కలిసి పనిచేస్తుంది. విషయాల రహస్య సేకరణ, రహస్య కార్యకలాపాలు, ఉగ్రవాదాన్ని అరికట్టడం దీని యొక్క ప్రధానమైన బాధ్యతలు.




మార్చి, 1951లో ఈ సంస్థను పునర్వవస్థీకరించి మెరుగుపరిచారు. ఇది డైరెక్టుగా ప్రధాని కార్యాలయంతో సంబంధం కలిగియుంటుంది. ఇశ్రాయేల్ రాజ్యాంగ చట్టాల నుండి మినహాయింపు పొందినందున ఈ సంస్థ డైరెక్టర్ ఎవరికీ సమాధానం చెప్పాల్సిన అవసరం లేదు, కేవలం ఆ దేశ ప్రధానికి తప్ప.

మొసాద్‌కు పరిశోధనా విభాగం మరియు వీరికి అవసరమైన సాంకేతిక సాధనాల అభివృద్ధి కొరకు ఒక సాంకేతిక విభాగము కూడా ఉన్నది.

మొసాద్, రాజైన సొలోమోన్ చెప్పిన ఈ క్రింది బైబిల్ వచనాన్ని దాని నినాదంగా స్వీకరించింది. ఈ

సామెత ఎల్లప్పుడూ మార్గం సుగమం చేయడాన్ని, చొరవ చూపడాన్ని మరియు సృజనాత్మకతను ప్రోత్సహిస్తుంది, అదే సమయంలో తీవ్రమైన హెచ్చరిక చిహ్నంగా కూడా పనిచేస్తుంది :

*"నాయకులు లేని జనులు చెడిపోవుదురు ఆలోచనకర్తలు అనేకులుండుట రక్షణకరము"* (సామెతలు 11:14)

బైబిల్ కాలంలో కూడా ఈ గూఢచార వ్యవస్థ ఉన్నట్లు బైబిల్ సాక్ష్యమిస్తోంది. "మరియు యాజెరు దేశమును సంచరించి చూచుటకై మోషే మనుష్యులను పంపగా..." (సంఖ్యా 21:32)లో మొదటి సారిగా వేగులను పంపినట్లు అటుతర్వాత యెరికోకు కూడా పంపినట్లుగా చూడవచ్చును.

## మొసాద్ ఆవిర్భావం :

ఈ సంస్థ స్థాపనకు దారి తీసిన పరిస్థితులను గమనించినట్లయితే; నవంబర్ 29, 1947 లో యు.ఎన్. జనరల్ అసెంబ్లీ చేసిన విభజన తీర్మానం ఇశ్రాయెల్‌ను యుద్ధాల సుడిగుండంలోకి నెట్టింది. మొదట, ఇశ్రాయెల్ భూభాగంలో నివసిస్తున్న అరబ్బులు యూదులపై హింసాత్మక చర్యలను ప్రారంభించారు. ఆపై, మే 14, 1948 రోజున (యూదు క్యాలెండర్ ప్రకారం 5 ఐయ్యర్, 5708) ఇశ్రాయెల్ స్వతంత్ర దేశంగా ప్రకటించబడిన తర్వాత అరబ్ దేశాల సైన్యాలు దక్షిణ, తూర్పు మరియు ఉత్తరం నుండి దేశంపై దాడులు చేసాయి. ఈ తరుణంలో దేశాన్ని సుస్థిరం చేయడం మరియు అరబ్ దేశాల సైనికదాడి నుండి రక్షించుకోవడం చాలా అవసరంగా మారింది.

ఈ సమయం వరకు, ఇశ్రాయేల్‌లో అనేక రహస్య, పాక్షిక రహస్య సంస్థలు పనిచేస్తున్నాయి. అవి సహజంగానే, యూదులను రక్షించడం, అక్రమ వలసలు, అరబ్ అల్లరి మూకలపై ప్రతిదాడి చేయడం లాంటివి చేస్తుంటాయి.

ఇశ్రాయేల్ యొక్క అతిపెద్ద పారామిలిటరీ సంస్థ హగానా (ది డిఫెన్స్). హగనా కార్యకలాపాల కోసం మరియు అరబ్బులతో రాజకీయ-సైనిక వివాదానికి యూదు నాయకత్వానికి మేధస్సును అందించడానికి సమాచారాన్ని సేకరించడానికి షెరూట్ యెడియోట్ (షాయ్, సమాచార సేవ) ను స్థాపించింది. స్వాతంత్ర్యానికి పూర్వ సంవత్సరాల్లో షాయ్ గణనీయంగా స్థిరపడింది.

ఇసెర్ హాల్పెరిన్ (ఇషర్ హరేల్, 'లిటిల్ ఇషర్') మరియు యోసేఫ్ యిశ్రెలీల నేతృత్వంలో 'అంతర్గత సమాచార సేవ' (ప్రస్తుత షిన్ బేత్) ఏర్పాటు చేయబడింది. యోసేఫ్ యిశ్రేలీ హగనా యొక్క జాతీయ ప్రధానకార్యాలయం యొక్క పూర్వ-రాష్ట్ర సభ్యుడిగా ఉండేవాడు మరియు 1948 వేసవిలో, యోసేఫ్ యిశ్రెలీ రక్షణ మంత్రిత్వ శాఖ ప్రధాన కార్యదర్శి అయ్యారు.

ఆ తర్వాత జూలై 1949 లో, ఇంటెలిజెన్స్ అండ్ సెక్యూరిటీ సర్వీసెస్ సమన్వయం కోసం సెంట్రల్ ఇన్‌స్టిట్యూట్ ('మొసాద్') ను స్థాపించాలని రూవెన్ షిలోహ్ ప్రతిపాదించాడు. ఇంటెలిజెన్స్ కార్యకలాపాలలో మరింత సమన్వయం సాధించడం ఈ ప్రతిపాదన యొక్క లక్ష్యం. బెన్ గురియన్ ఈ ప్రతిపాదనను ఆమోదించడంతో డిసెంబర్ 13, 1949 రోజున 'మొసాద్' స్థాపించబడింది. ఇన్‌స్టిట్యూట్ ఫర్ కోఆర్డినేషన్ స్టేట్ డిపార్టుమెంటును నియంత్రిస్తూ ఇతర రెండు సంస్థలైన, షిన్ బెత్ మరియు ఐడిఎఫ్ యొక్క ఆపరేషన్స్ విభాగం యొక్క ఇంటెలిజెన్స్ విభాగం కార్యకలాపాలను సమన్వయం చేయుడానికి ఉద్దేశించబడింది. తరువాత ఇది ఇన్‌స్టిట్యూట్ ఫర్ ఇంటెలిజెన్స్ అండ్ స్పెషల్ ఆపరేషన్స్ (Institute for Intelligence and Special Operations) గా మారింది. డిసెంబర్ 13, 1949 (22 కిస్లెవ్ 5710) 'మొసాద్' యొక్క స్థాపన తేదీగా నిర్ణయించబడింది.

## 'మొసాద్' యొక్క డైరెక్టర్లు :

1. రూవెన్ షిలోష్ (1949-1952)
2. ఇస్సేర్ హారెల్ (1952-1963)
3. మెయిర్ అమిత్ (1963-1968)
4. జ్వి జమీర్ (1968-1974)
5. యిట్జక్ హోఫీ (1974-1982)

6. నహూం అడ్మోని (1982-1989)
7. షబ్తయ్ షవీత్ (1989-1996)
8. డేని యాతోమ్ (1996-1998)
9. ఎఫ్రయీమ్ హలేవీ (1998-2002)
10. మెయిర్ దాగన్ (2002-2011)
11. తామిర్ పార్డో (2011-2016)
12. జోసెఫ్ (యొస్సీ) కోహెన్ (2016-2021)
13. **డేవిడ్ బర్నియా (2021-ప్రస్తుతం)**



Present Mossad chief **DAVID BARNEA**

## 'మొసాద్' ఆపరేషన్స్ సంక్షిప్తంగా :

మొసాద్ స్థాపించబడినప్పటి నుండి, దేశ అవసరాల ఆధారంగా ఇంటెలిజెన్స్ సేకరణలో పాల్గొన్నది. వీటిని ఎప్పటికప్పుడు తనిఖీ చేసి, ముసాయిదా సమాచారాన్ని తయారు చేస్తారు. వీటిని **EEI**- ఎసెన్షియల్ ఎలిమెంట్స్ ఆఫ్ ఇన్ఫర్మేషన్ అని పిలుస్తారు. ఇది **HUMINT** (హ్యూమన్ ఇంటెలిజెన్స్) మరియు **SIGINT** (సిగ్నల్స్ ఇంటెలిజెన్స్) వంటి వివిధ మార్గాల ద్వారా జరుగుతుంది. కార్యకలాపాలన్నీ రహస్యంగా ఉంచబడతాయి.

సంవత్సరాల నుండి ఇప్పటి వరకు, 'మొసాద్' ఇంటెలిజెన్స్ ప్రపంచంలో ఇతర దేశాల ఇంటెలిజెన్స్ సేవలతో ఇంటెలిజెన్స్ సంబంధాలను కూడా అభివృద్ధి చేసింది మరియు కొనసాగించింది. ఇజ్రాయెల్‌తో బహిరంగ సంబంధాన్ని ఇష్టపడని దేశాలతో రహస్య సంబంధాలు ఏర్పరచుకోవడంలో కూడా 'మొసాద్' పాల్గొంటుంది. ఈజిప్ట్ మరియు జోర్డాన్‌లతో శాంతి ఒప్పందాలకు ముందు జరిగిన రహస్య చర్చలలో దేశ నాయకులకు 'మొసాద్' సహాయం వంటి అనేక రకాల సంబంధాలు ప్రచారంలో ఉన్నాయి.

నాజీ నేరస్థులను వెంబడించడం, 1960లో నాజీ నేరస్థుడు అడాల్ఫ్ ఐష్మన్‌ను పట్టుకోవడం మరియు ఇజ్రాయెల్‌లో అతని విచారణ వంటి వాటిలో 'మొసాద్' పాత్ర చెప్పుకోదగినది. మరొక ఉదాహరణ, యోసేల్ షూమేకర్ తన తల్లిదండ్రుల నుండి అపహరించబడి, తన తాత ఇజ్రాయెల్ నుండి అక్రమ రవాణా చేసిన తరువాత అతన్ని 1962 లో ఇజ్రాయెల్‌కు తిరిగి తీసుకురావడం జరిగింది. ఈ వ్యవహారం ఆ సమయంలో తీవ్ర కలకలం రేపింది. మత పరమైన అంతర్యుద్ధం చెలరేగుతుందనే భయం కారణంగా, డేవిడ్ బెన్ గురియన్ పిల్లవాడిని గుర్తించి తిరిగి తీసుకురమ్మని 'మొసాద్'ను ఆదేశించాడు.

సమస్యాత్మక దేశాల నుండి యూదులను రక్షించి ఇజ్రాయెల్‌కు తీసుకురావడానికి 'మొసాద్' పనిచేసింది. ఇథియోపియా యూదులను ఇజ్రాయెల్‌కు తీసుకువచ్చిన Mivtza Moshe (ఆపరేషన్ మోసెస్) ఈ కార్యకలాపాలలో ప్రముఖమైనది.

విదేశాలలో యూదు మరియు ఇజ్రాయెల్‌ను లక్ష్యంగా చేసుకున్న ఉగ్రవాదానికి వ్యతిరేకంగా జరిగిన యుద్ధంలో మొసాద్ తన స్వభావాన్ని ప్రదర్శించింది.

ఇజ్రాయెల్‌కు ముప్పు కలిగించే దేశాలను అక్రమంగా ఆయుధాలను పొందకుండా నిరోధించడంలో కొన్నేళ్లుగా మొసాద్ కీలక పాత్ర పోషించింది.

(భారతదేశం యొక్క బాహ్య ఇంటెలిజెన్స్ ఏజెన్సీ అయిన **'రీసెర్చ్ అండ్ ఎనాలిసిస్ వింగ్'** (R&AW) తో

మొసాద్ రహస్య సంబంధాలు కలిగి ఉన్నదని 2003లో ఒక కథనం బయటికివచ్చింది. R&AW ని 1968 సెప్టెంబర్‌లో **'రామేశ్వర్ నాథ్ కావో'** స్థాపించినప్పుడు, మొసాద్‌తో సంబంధాలు పెంచుకోవాలని అప్పటి ప్రధాని **'ఇందిరా గాంధీ'** సలహా ఇచ్చారు. పాకిస్తాన్ మరియు చైనాతో పాటు ఉత్తర కొరియాతో సైనిక సంబంధాలకు ప్రతిఘటనగా ఇది సూచించబడింది.)

'మొసాద్' చేసిన గొప్ప మిషన్స్‌కు సంబంధించి 2012లో ఒక పుస్తకం ప్రచురించబడింది. అదే MOSSAD : THE GREATEST MISSIONS OF THE ISRAELI SECRET SERVICE by Michael Bar-Zohar & Nissim Mishal. ఇందులో మొసాద్ చేపట్టిన వివిధ ఆపరేషన్స్ గురించి చెప్పబడ్డాయి. వీలైతే చదవండి. ఆసక్తి ఉన్నవారు ప్రక్కన ఉన్న పుస్తకంపై క్లిక్ చేయండి.




**మొసాద్, ఐడిఎఫ్ ఆపరేషన్స్ మరియు ఇతర పోరాటాలు, దాడులు, హత్యలలో కొన్నింటి గురించి రాబోయే సంచికలలో మనం సవివరంగా తెలుసుకుందాం.**

---

**Source :** Mossad's Official Website and Wikipedia



*Ex-Prime Minister Benjamin Netanyahu with outgoing Mossad chief Yossi Cohen and incoming Mossad chief David Barnea at a farewell event for Cohen, May 31, 2021.*
(photo credit: KOBY GIDEON/GPO)

## రాబోయే సంచికలలో...

- **బైబిల్ సర్వే**
  బైబిల్‌లోని 66 పుస్తకాల గురించి సమగ్ర విశ్లేషణ, అధనపు సమాచారము తెలుసుకుందాం!
- **ప్రత్యేక శీర్షికలు**
  సువార్తకు ఆటంకాలు కలిగించే అంశాలు, క్రైస్తవ్యంపై ద్వేషానికి గల కారణాలు, కేలండర్ తదితర అంశాల గురించి తెలుసుకుందాం!
- **బయోగ్రఫికల్ స్టడీస్**
  అబ్రహాము, మోషే, ఇస్సాకు, యాకోబు, దావీదు, సొలోమోను మొదలగువారి జీవితాల గురించి చదువుకుందాం!
- **ఇతర మత అధ్యయనాలు**
  హిందూమతం, ఇస్లాం మతం, యూదా మతం గురించి అధ్యయనం చేద్దాం!
- **క్రైస్తవ పండుగలు**
  ఈస్టర్, క్రిస్మస్ పండుగల గురించిన వాస్తవాలను విశ్లేషించుకుందాం!
- **క్రైస్తవ చరిత్రలో ముఖ్యమైన ఘట్టాలు**
  క్రీ.శ. మొదటి శతాబ్దం నుండి ఇప్పటి వరకు క్రిస్టియానిటీలో జరిగిన ముఖ్యమైన ఘట్టాల గురించి తెలుసుకుందాం!
- **యూదుల పండుగలు**
  యెహోవా దేవుడు యూదుల కొరకు ఏర్పాటుచేసిన పండుగల గురించి వాటి విశిష్టత గురించి తెలుసుకుందాం!

**-ఎడిటర్**

# మనం-మన మిషనరీలు

క్రీ.శ.354లో భారత దేశానికి క్రైస్తవులు వచ్చినట్లు అధికారికంగా చరిత్ర చెబుతోంది. థియోఫిలస్ 'ది ఇండియన్'లో ప్రస్తావించబడింది. అయినప్పటికీ అంతకుముందు క్రీ.శ.180లో **సెయింట్ పాంటెనస్** భారతదేశం వచ్చినట్లు **యూసిబియస్** తన గ్రంథంలో (Historia Ecclesiastica) వ్రాసాడు. మన భారతీయ క్రైస్తవ సంప్రదాయం ప్రకారం క్రీ.శ.52లో **అపోస్తలుడైన తోమా** కేరళకు వచ్చినట్టు తెలుస్తోంది. అయితే మొదటి శతాబ్దంలో తోమా వచ్చినట్లు సరియైన ఆధారాలు లేకపోయినా రెండవ-మూడవ శతాబ్దంలో అయినా భారతదేశానికి సువార్త అందిందనేది కాదనలేని సత్యం. మూడవ శతాబ్దంలో అంటే క్రీ.శ.295లో బాస్రాకు చెందిన దుడి (డేవిడ్) భారతదేశంలో సువార్త ప్రకటించాడని కూడా ఆధారాలు ఉన్నాయి.

7వ శతాబ్దం చివరిలో భారతదేశంలో అరబ్బులు అడుగుపెట్టారు. ప్రస్తుతం (2021) వారి జనాభా 19.67 కోట్లు (14%) కాగా మన క్రైస్తవుల జనాభా 3.23 కోట్లు (2.3%) మాత్రమే. ఇందులో కూడా ఈశాన్య రాష్ట్రాల జనాభానే ఎక్కువ. దాదాపు నాలుగు శతాబ్దాల తర్వాత భారతదేశంలో అడుగుపెట్టిన ముస్లిం జనాభా 6 రెట్లు ఎక్కువగా ఉంది. ఇస్లాం ప్రచారకమతం కానప్పటికీ (బలవంతపు మతమార్పిడిలు జరిగాయనుకోండి), క్రిస్టియానిటీ ప్రచారక మతం అయినప్పటికీ, ముస్లిం జనాభా మన క్రైస్తవుల కంటే సుమారు 6-7 రెట్లు ఎక్కువగా ఉంది. దీనికి కారణం ఏమైయుంటుందో మనం అర్థం చేసుకోవచ్చు. మనం **సువార్తను** సరిగా ప్రకటించకపోవడమే!

ఎంతో మంది విదేశీ మిషనరీలు తమ కుటుంబాలను, ప్రాణాలను పణంగా పెట్టి ఇండియాకు సువార్తను అందించారు. విదేశీయులకు ఇక్కడ ఉన్న ప్రజలకు సువార్త చెప్పడం చాలా కష్టంతో కూడుకున్న పని. ఎన్నో ఆటంకాలు, ఎన్నో అవరోధాలు. భాష, రంగు, ఆహారము, ఆహార్యము... ఇలా ఎన్నో అవరోధాలు వారికి ఉండేవి. అయినా కూడా వాటిని జయించారు. ఇక్కడి భాషను నేర్చుకున్నారు, వారి అలవాట్లను మార్చుకున్నారు, నిద్రాహారాలు మాని ఇక్కడి వారి గురించి ప్రార్థించారు. ఇక్కడి వారికి విద్యనందించారు, వైద్యం అందించారు, ఆహారం పెట్టారు, వస్త్రాలు కట్టించారు.... ఇలా ఎన్నో రకాలుగా ప్రయత్నించి వారికి సువార్త అందించి **క్రీస్తుకు అంటుగట్టారు.**

విదేశీయులకే అంత చిత్తశుద్ధి, సమర్పణ ఉంటే, మరి మన ప్రజల పట్ల మనకెంత చిత్తశుద్ధి, బాధ్యత, భారము ఉండాలి? మరి మనమేం చేస్తున్నాం? సువార్తను ప్రకటించడం, మిషనరీలను తయారు చేయడం మానేసి, ఆ సంఘం నుండి కొంత మందిని, ఈ సంఘం నుండి కొంత మందిని లాగేసుకొని **'మెగా'** చర్చిలను కడుతున్నాము. **విశ్వాసులు పాస్టర్లకు అంటుగట్టబడుతున్నారు.** ఇదే దేవుని ఆశీర్వాదమని, సంఘం అభివృద్ధి చెందుతోందని అనుకుంటున్నాము. ఇది బలుపు కాదు, వాపు మాత్రమే. దేవుని భయమనేదే లేకుండా పోయింది. దేవుని పేరుతో ఎన్నో అక్రమాలు చేస్తున్నాము. ఓ క్రైస్తవుడా ఇకనైనా మేలుకో! దేవునికి భయపడు, సువార్త ప్రకటించడం నీ బాధ్యత అని గుర్తించు, సువార్తను ప్రకటించడానికి నిన్ను నీవు సమర్పించుకో!

ఆదిమ అపోస్తలులు అనుదినము దేవాలయముకు వెళ్లి సువార్త ప్రకటించారు (అపో.కా. 2-4 అధ్యాయాలు). ఒకప్పుడు మన ఆంధ్రదేశములో కూడా మత ప్రచార యాత్రలలో క్రైస్తవ మిషనరీలకు బ్రాహ్మణుల ఇండ్లలో ఆతిథ్యం లభించేదని, క్రైస్తవ ప్రచారసభలు తరచుగా **దేవాలయాలలో** జరుగుతూ ఉండేవని ఆచార్య బి.యస్.యల్. హనుమంతరావు గారు **'ఆంధ్రదేశంలో మత పరిణామాలు'** అనే గ్రంథంలో పేర్కొన్నాడు. మరి ఇప్పుడెలా ఉన్నాయి పరిస్థితులు. ఇంతటి భయంకరమైన మత విద్వేషానికి కారణం ఎవరు? హిందువులను, వారి మత గ్రంథాలను సోషల్ మీడియా వేదికలుగా విమర్శించడం, దూషించడం కారణం కాదా? అలా దూషించడం సువార్తకు ఆటంకం కాదా? ఎటు పోతోంది మన క్రైస్తవ్యం. ఆలోచించండి!

**దేవుడు మనలను తన సువార్త పరిచర్యకు బహుబలంగా వాడుకొనును గాక! ఆమెన్.**


Jeriah Bible Mission
Peddapalli, Telangana-505172
jeriahbiblemission@gmail.com
jeriahbiblemission.blogspot.com
 7013 63 9470

పాఠకులకు మన ప్రభువైన యేసుక్రీస్తు నామములో వందనాలు....

మేము అందించే ఈ ఆర్టికల్స్ దయచేసి మీకు తెలిసిన ఇతర క్రైస్తవ సహోదరులకు షేర్ చేయండి. ఒకవేళ ఈ ఆర్టికల్స్‌కు సంబంధించి ఏమైనా మార్పులు, చేర్పులు సూచించడానికి మీరు ఇష్టపడినట్లయితే, మా దృష్టికి రానివి, అప్‌డేట్ చేయాల్సినవి ఏమైనా ఉంటే తప్పకుండా మాతో షేర్ చేసుకోగలరు. అలాగే ఏదైనా అంశానికి సంబంధించిన ఆర్టికల్ కోసం మీరు ఎదురు చూస్తున్నట్లయితే ఆ విషయాన్ని మాకు తెలియపరచినచో మా టీం సభ్యుల ద్వారా మీకు అందించే ప్రయత్నం చేస్తాం. అదేవిధంగా, మీ వద్ద ఏమైనా మంచి సాక్ష్యాలు, వాక్యానుసారమైన, పరిశోధనాత్మకమైన ఆర్టికల్స్ ఉన్నట్లయితే ఈ పత్రికలో ప్రచురించడానికి మీరు ఇష్టపడినట్లయితే మాకు పంపించి ఈ పరిచర్యలో పాలిభాగస్తులు కాగలరని ఆహ్వానిస్తున్నాము.

మరో ముఖ్యమైన విషయమేమంటే, మీరు నివసిస్తున్న పట్టణం, ప్రాంతంలో మొట్టమొదటి సారిగా ఎవరు సువార్త ప్రకటించారో, వారి గురించి, వారి పరిచర్య గురించి వివరాలు సేకరించి మాకు పంపించగలరు. వీలైతే వారి ఫోటోలు కూడా సేకరించండి. మన ప్రాంతాల్లో మన దైవజనులు ఎంతో మంది సువార్త పరిచర్య చేసి సంఘాలను స్థాపించారు. మనం మన చరిత్రను వ్రాసుకునే అలవాటు లేకపోవడం వలన వారి సువార్త పరిచర్య వివరాలు ఎవరికీ తెలియకుండా పోయాయి. ఇకమీదటనైనా వారి పరిచర్య వివరాలు వెలుగులోనికి తీసుకొనిరావడానికి మనవంతు ప్రయత్నం తప్పకుండా చేద్దాం!

ఈ పత్రికా పరిచర్య దేవునికి మహిమకరంగా ఉండునట్లు ప్రార్థించండి. అలాగే మీ యొక్క సహాయ, సహకారాలు మాకు తప్పకుండా అందించండి! దేవుని కృప ఎల్లవేళలా మనకందరికి తోడైయుండి కాచి కాపాడి నడిపించును గాక! ఆమేన్.

- జెరియా బైబిల్ మిషన్